## తారాగణం

| | |
|---|---|
| పద్మశ్రీ నాగయ్య | కృష్ణకుమారి |
| శోభన్ బాబు | వాణిశ్రీ |
| నాగభూషణం | శాంతకుమారి |
| రమణారెడ్డి | విజయలలిత |
| రాజబాబు | రమాప్రభ |
| అల్లు రామలింగయ్య | జ్యోతిలక్ష్మి |
| సీతారాం | కనకం |
| రామచంద్రరావు | పద్మాంజలి, మంజుల |

వగైరా...

నిర్మాత: యం. యస్. రెడ్డి

దర్శకత్వం: కె. యస్. ప్రకాశరావు

డిస్ట్రిబ్యూటర్సు:

ఆంధ్ర & సీడెడ్: విజయ కంబైన్స్,

నైజాం: వాణీ

# సాంకేతిక నిపుణులు

కథ : కె. యస్. గోపాలకృష్ణన్

మాటలు : అనిసెట్టి

పాటలు : సముద్రాల, ఆత్రేయ, శ్రీ శ్రీ, ఆరుద్ర, అనిసెట్టి, కొండమాచార్య, మల్లెమాల

సంగీతం : మాస్టర్ వేణు

నేపథ్యగాయకులు : ఘంటసాల, సుశీల, పి. బి. శ్రీనివాస్, జానకి, యల్. ఆర్. ఈశ్వరి

కళ : రాజేంద్రకుమార్, బి. ఏ.

నృత్యం : చిన్ని & సంపత్

కూర్పు : బండి గోపాలరావు

ఛాయాగ్రహణం : టి. దొరై

దుస్తులు : బి. నారాయణమూర్తి

స్టిల్సు : శ్యామ్‌కుమార్

పబ్లిసిటీ : రూప్‌కళా

ప్రెస్ పబ్లిసిటీస్ : విజయా

స్టూడియోలు : వీనస్ & వాహినీ

సహకారదర్శకులు : కె. రాఘవేంద్రరావు, బి. ఏ., జి. సి. శేఖర్

## —: కథా సంగ్రహం :—

సహనానికి పర్యాయపదం "శాంత"
స్త్రీ జాతికి శిరోరత్నం "శాంత"
భారతీయ సంస్కృతికి ప్రతిబింబం "శాంత"
హైందవ సాంప్రదాయానికి అద్దం "శాంత"
అయినా ......................................
ఆమె జీవితం అడవిగాచిన వెన్నెల
బ్రతుకుబాటలో ఆమెకు ఎదురైనది, సాధారణ మిట్టపల్లాలుకావు
అంతులేని "అగాధాలు"
ఆమె జీవితనౌకను అడ్డగించినది, ఉత్తుంగ తరంగాలుకావు
భయానక "సుడిగుండాలు"

......................................
అచంచల దృఢసంకల్పంతో, నావనడుపుటకు ప్రయత్నించింది
ఇంతలో పెనుతుఫాను చెలరేగింది
ఆ తుఫానులో చుక్కాని ఎక్కడికో ఎగిరి పోయింది
కాని,..........ఆమె లక్ష్యం విడువలేదు
మనోనిబ్బరం మార్గదర్శిగా ముందుకు సాగేందుకే దీక్షవహించింది
....కాలం ఆమెపై కక్షబూనింది
కారుమేఘాలు నలువైపులా క్రమ్ముకొన్నాయి
కటిక చీకట్లు దశదిశలా వ్యాపించాయి
అంతా అంధకార బంధురమైంది....ఆ తర్వాత ఏమైంది?

......................................
వెలుగు ప్రసరించిందా ఆమె జీవితంలో?
ఆనందం వెల్లివిరిసిందా ఆమె హృదయంలో?
అమృతం వర్షించిందా ఆమె భవిష్యత్తులో?
సమాధానం ..................వెండి తెరపై చూడండి......

# పాటలు

## పాట నెం: 1

రచన: సముద్రాల రాఘవాచార్య

పాడినవారు: పి. సుశీల

నిన్నచూసింది — ఈ అరుణకాంతులే
నిన్న పూసింది — ఈ చామంతులే
వింత అందాలు — చిందేను నేడెందుకో ॥నిన్న॥
ఎరుగవు నీవు — ఎపుడీ హాయి
ఎగసీ పడేవిలా — ఎందుకే తువ్వాయి
ఓ విరజాజి — నిను జతగూడి
తుంటరి తేటీ — సరాగమూలాడీ
పలికే పదాలలో — భావాలేమే ॥నిన్న॥
పెన్నిధి వోలే — దొరికితి వీవు
నిలువుమయా — నా తోడుగా
నిన్నే నామది — నమ్మిన దానా
నను పాలింపుమా — స్వామీ ॥నిన్న॥

## పాట నెం: 2

రచన: ఆత్రేయ

పాడినవారు: ఎల్. ఆర్. ఈశ్వరి & పార్టీ

వయసంటే ఏమనుకొన్నావూ
కోడెనాగు వంటిది
కొండవాగు వంటిది
కోతిపిల్ల లాంటిది ॥వయసంటే॥
మందిలోవుంటే మనసూర్కోదూ
ఒంటరిగుంటే ఒళ్లూర్కోదూ

చీకటిపడితే సెగపుడుతుంది
రాతిరిఅంతా రగిలిస్తుంది ||వయసంటే||
షుడికిస్తుంది పుసరెక్కిస్తుంది
పులకలు వేస్తుంది ...
కవ్విస్తుంది కైపెక్కిస్తుంది
కలరిప్పిస్తుంది కలవరిప్పిస్తుంది ||వయసంటే||
దాచినకొద్దీ బయటే పడుతుంది
దోచేవాడికి దోవ చెపుతుంది
మిడిమేలపు వయసు — సదసుంత్రపు సిరికి
మిడిసీ మిడిసీ పడుతుంది
మిడిసి మిడసి పడుతుంది ||వయసంటే||

## పాట నెం: 3

రచన: పాడినవారు:
ఆరుద్ర సశీ & పార్టీ

ఇంటి కన్నె గుడి పదిలం
ఇది విలాసాల నిలయం
రేయి పగలు సంబరం
హాయి హాయి ముమ్మురం
ముక్క కలిసెనా – బలే ముచ్చటా
చిక్కులున్నవే – లేవు ఇచ్చటా
చుక్క
చుక్క
చుక్కలాగ దిగివచ్చి
చక్కదనం చవిచూపి
అంతటితో ఆగమంటే వలదు కలవరం ||ఇంటి||
మనసు కలిగితే – దాచి పెట్టకు
ఆశ పెరిగితే – అణచివేయకు

దొంగ
దొంగ
దొంగ—చూపు చూడవద్దు
దోచకోయి లేతసిగ్గు
దోరవయసు రమ్మంటే వలదు తత్తరం ||ఇంటి||
పడుచు గుండెలు – పగ్గమెందుకు
పడుచుపంతయు – పిలిచె విందుకు
వేడి
వేడి
వేడి వేడి సరాగాలు
వేడుకైన తాయిలాలు
చూపులతో ఆరగించు – తీపి యవ్వనం

పాట నెం: 4

రచన: మల్లెమాల

పాడినవారు: ఘంటసాల & సుశీల

చీటికి మాటికి – చిటపటలాడే చిన్నది
యిపుడే మన్నది?
విరసంలోనే సరసమున్నది – వెర్రినాయనా
అన్నది!
ముచ్చటలాడితే చెప్పిపోయినా – చిచ్చుబుద్ధి
యే మన్నది?
కల్లా కపటం తెలియని చెనతో – గిల్లికజ్జ
తగదన్నది!
చిక్కటి నీలపు నింగికెగిరినా – చక్కని
చుక్కే మన్నది?
చిటారు కొమ్మన మిటాయి కోరకే – పెట్టకొంటనని
అన్నది! ||చీటికి||

కసరికొట్టుచూ రుసరుసలాడిన — కన్నెపిల్ల
యే మన్నది ?
విసిరిన బాణం తగిలిందీ — నీ పస తెలిసిందని
అన్నది !
అందమైన మనజంటను చూచి బృందావన
మే మన్నది ?
ముందున్నదిలే ముసళ్ళపండగ తొందర పడ
వద్దన్నది !

## పాట నెం: ౫

రచన: శ్రీ శ్రీ

పాడినవారు: పి. బి. శ్రీనివాస్

అయ్యయ్యో — అయ్యో — అయ్యో —
అయ్యో పరితాపం
అమ్మమ్మో — అమ్మో — అమ్మో —
అమ్మో గ్రహచారం
ఈ వంట తంటా
నా కెందు కంటా
ఆకలి మంట
ఆరని దంట
కోరి విడిచాను రీటాని
కోలుపోయా కిరీటాన్ని ‖అయ్యయ్యో‖
కోడిగుడ్డట్టు — మాడింది ఒట్టు
వేశాను దోస్తు — అదంతా వేస్టు
వేశాను దోశ — తినలేక ఊశా

హొయ్యిలో నిప్పు — గుడ్డల్కి-ముప్పు
కోరి విడిచాను రీటాని
కోలుపోయా కిరీటాన్ని ॥అయ్యయ్యో॥
మై డియర్ ప్యారీ — అయామ్ సో సారీ
మన డైవోర్సు — ఓ పెద్ద ఫార్సు
హెవెన్‌లాంటిల్లు — అయిపోయె హెల్లు
దేశాను తప్పు — వదిలింది తుప్పు
కోరి విడిచాను రీటాని
కోలుపోయా కిరీటాన్ని

## పాట నెం : 6

రచన: పాడినవారు:
కొండమాచార్యులు పి. సుశీల

దేవుడిచ్చిన — కానుకవూ
మనిషి విడిచిన — మమతవూ
అన్నెమెరుగని — పున్నెమే — ని
న్నాదుకోనురా — నిదురపో
కాడలేనీ — పువ్వులేదు
నీడనివ్వని — చెట్టులేదు
ముద్దు ముచ్చట — లేవిలేకా
నీవుకలవూ — నేనుకలను
పోసినవ్వుల — బుజ్జినాన్నా
జానికథల — లాలిపాడేదా ॥దేవుడిచ్చిన॥

కాయు తీగకు – బరువుకాదు
కరుణ దేవుడు – దాచుకోడు
నల్లమబ్బూ – కురిసి కురిసీ
తెల్ల వెలుగూ – రాకపోదు
బోసి నవ్వుల – బుజ్జినాన్నా
జాలికథలా – లాలిపాడేదా ॥దేవుడిచ్చిన॥

పాట నెం : 7

పాడినవారు:
జానకి

ఎట్టి మహాపరాధముల నేనొనరించితి నొక్కొ పూర్వ మం
దెట్టి మహాత్మురాలి పతినే నెడబాపితి నొక్కొ; కాదయే
నిట్టులు నిర్నిమిత్తముగ నేయఘమైన నెరుంగనట్టి న
న్నట్టడవిన్ విడంగ నరనాథుడు పంచునె? దోసమెంచునే?

* * * * * *

ఏటికి పుణ్యశీలుడు నరేంద్రుడు రామవిభుండు నిన్వనీ
వాటికి బంపెనిట్లు? అటువంటి యసత్కృతి యేమిచేసితో
బోటి? యటంచు నన్ను మునిపుంగవులాడగ నేమిపల్కుదున్
పాటి దొరంగి నా విభునిపై నెటు జెప్పుదు నిర్దయత్వమున్

పాట నెం : 8

రచన:
అనిశెట్టి

పాడినవారు:
యల్. ఆర్. ఈశ్వరి

చక్కని లే జవరాలు
పక్కన నవ్వినచాలు
మతిచలించి
ప్రతిమగాడూ
పగవశమైపోతూ లా!

లలలా....లలలా....లలలా....
పాల మీగడకన్నా
పనస తొనల కన్నా
ముచ్చటైన
ముద్దరాలి
మోవి తీపి మిన్నా !
లలలా....లలలా....లలలా.... ॥చక్కని॥

రమణి వలపుల కోసం
తగదు పగటి వేషం
నిజము తెలిపి
చేయి కలిపి
పొందు మా సంతోషం !



1: భార్యాభర్తల అనుబంధం శాశ్వతం.

2: భారతనారికి పతియే ప్రత్యక్ష దైవం.

3. ఆమె నమ్ముకొన్న నమ్మునేసే అధికారం ఎవ్వరికీ లేదు.

4: విడాకులిచ్చినంత మాత్రాన, పవిత్రమైన వివాహ బంధం విచ్ఛిన్నం కాదు.

5: హైందవ స్త్రీకి ఆజన్మాంతం ఒకడే భర్త.

6: ఇల్లాలే ఇంటికి దీపం.

7: ఇంటికంటె గుడి పదిలం కాదు.

8 ఆనందం అంగట్లో దొరకదు.

9. ఆత్మవంచన అనర్థాలకు మూలం.

10 మనో నిగ్రహం మగువకు భూషణం.

11: ప్రాణంకంటె శీలం విలువైనది.

12: శీలం పోగొట్టుకొన్న స్త్రీ శిలతో సమానం.

[illegible]: సముద్రాల కల్యాణం

కౌముదీ వారి మహోజ్జ్వల చిత్రకావ్యం



ఎలయీ కంబైన్స్ రిలీజ్

# భార్య